సేవాసంఘప్రచురణములు—1.

# హాంళీక్రీ



గ్రంథకర్త

బాలదారి వీరనారాయణదేవు.

రాజమహేంద్రవరము.

1922.

డి. వి. రమణారావుగారిచే

శ్రీవిద్యావిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

# హాళికి



ఇది క్రీస్తుశకము. చిత్రవిచిత్రములతో బహు దృశ్యములతో భయంకరనాదములతో, భావప్రసన్నములతో వింతమార్పులతో వినోదసౌఖ్యములతో నడచు ఇరువదియవశతాబ్దము. ప్రస్తుతము మన్మథనామసంవత్సరము మాఘమాసము. ఉత్తరాయణము గడచుచున్నది. గాలిచే నూగులాడు నదీజలమట్లు లోకమల్లలాడుచున్నది. కవుల కలములలో, పాటగాని పిల్లరాగములలో భక్తుల యూహాలలో సంస్కర్తల నందనములలో చరిత్రకారుల సవరింపులలో బసిపాపల పాటలలో బాధితుల గుండెలలో నూతన భావములు పొంగి పొరలుచున్నవి. లోకవృత్తము దానవులై తలక్రిందులై తబ్బిబ్బులై యూగుడపుసడివలె తెకతెక నుడికిపోవుచున్నది. ప్రజలేవియో యన్నిత ప్రదర్శనముల జూచువారివలె మతిచెడి గంగవెఱ్ఱులెత్తి

యంగలార్చుచు వీధిబడినారు. కొందఱు యజ్ఞమని కొందఱు యాగమని మఱికొందఱు సుందరనాటకమని వేరొకకొందఱు యుద్ధరంగమని పరిపరివిధముల బలుకుచు నాయాపగికరములతో, గల్పనలతో నల్లిబిల్లిగ నల్లి సన్నాయినొక్కులు డోలువాయింపులు వగారామోత్రలు, బిల్లనగ్రోవిపాటలు బాడుచున్నారు. చదువరులారా! మనముగూడ పదిమందితోపాటు భుజము గలుపువారమగుటచేత నొక్కమారు లోకమును ముందువెనుకల దొంగిచూచి మఱిపోవుదము రండు. మనకెందుల కీవృథాప్రయాసమని యూరడించుతురా; అట్లుకాదు. కష్టములో సుఖము, భోగములో రోగము, ఇష్టములో నష్టము ఉన్నట్లే దీనిలోగూడ నేదియోనుండకమానదు. పదిమందితో చావు పెండ్లితో సమానమనిగదా పెద్దల సుద్దులు. నలుగురితో నారాయణా, కులముతో గోవిందాన్నాడు. మనతొంగిచూపులకు, దోబూచు

ల కెట్టిలో తుపాతులాన నోయెవ్వడెరుగు. ఒకనికి కాక
రకాయ బెల్లము, బీరకాయచేదు. తీపునష్టము. కార
నష్టము. ఒకనికి తావలచినది రంభ తా మునిగినది
గంగ. శ్రీరామచంద్రుడు సీతమ్మకై సేతువును గట్టు
చుండ, నుడుత నాకేమని యూరకొన్నదా? యథా
శక్తి సహాగమనమట్లు పాటుపడి వీపుపై బంగారురంగు
గీతలు దెచ్చుకొని కులికియలుకుచున్నది. ఆసుందరా
కారుని మనోహరరూపమును జూచి మనసుకట్టలేక
తల దిమ్మెక్కి గంధనాలాడుచు కోరచూపులతో
బారచేతులతో, మిడిగ్రుడ్ల మిటకరింపులతో, వదన
వికారపు తెటా కాయింపులతో, డొల్లముక్కు
తొజ్జల నిట్టూర్పులతో బొజ్జకడుపు బోరలపాటుతో
ప్రాణేశా, యని పట్టపగ్గములులేని పడుచుగిత్తలాగు
ఎదపోయిన గొడ్డులాగు, మతిపోయిన మడ్డిమృగము
లాగు కుప్పిగంతులతో, కొండకేకలతో, కోటపైబడి
శూర్పణఖ విరహబాధను బహుమానముగా ముక్కు

కారుచు, నిక్కుచూ, నీల్గుచూ, గజ్జెంగజ్జెములాగు మువ్వలబంతిలాగు, పావురాగు బాళింపులతో, గువ్వకు లుకులతో, కేకికేరింతలతో, చత్తురకంపుపిలుపులతో, అగరువాసన చేసన్నలతో, కన్నీళ్ల జలకములతో, చిలుకత్తడిరాతుబిగింపులతో, సాగింపకరాగా కాదు కాదని, అమ్మ సూత్రుని అబ్బబ్బె ను, ఆచారమని అల్లామని యుగలాప్పి, కాళ్ల మీద పడి. గడ్డముపట్టుకొని, వానిగాదని, వరుసగాదని, నీతిగాదని, జాతి చెప్పి కోతలుపడు భారతజాతి గొప్పచెప్పగలవాడెవడురా తండ్రి! అదేమికర్మమో, మేహాపొడలు దేహమునకెగబ్రాకి శరీరము వుండై దోసపండువలె పగిలి చీము గారుచు జాతిముక్కులైనా బిద్దలంబు పోవు వాసనతో కోతపుట్టు వానిని కాకులు గ్రద్దలు రాబందులు కూడ ముట్టుకోనివానిని పీశాపిశాచములుకూడ చూడగానే పిక్కబలము చూపువానిని నారాయణా చెప్పకోరానివానిని, విశువక మహాదర

ముతో మందహాసముతో మనసుఱుకగని నడవడి తో, మందగించని భక్తితో, మహాప్రసాదముని సే వింపుచు ప్రాణేశ్వరా! ప్రాణప్రియా! జీవితేశ్వరా! యనిపించుచు సేవలుసేయుచు, పాదములుకడిగి కన్నులకద్దుకొనుచు నెత్తిబెట్టుకొను మత్తకాశినుల కండమైయుండిన నీమొగసిదేశ మొదను సృష్టించెనో గదా! తెల్లవారితే చేతులోపడే సామ్రాజ్యమును, సర్వాధికారమును చెలాయింపగల యధికారమును అనుభవింపలేక, అదృష్టములేక, మతిమాలి నతి కాంక్షించవడి పెళ్ళిమేళ్ళను, వదుముముద్దులకు, వయసుబిగింపులకు, కులుకుచేతులకు, సన్నాయి నొక్కులకు, చిక్కుపడి బానచేసిన ముసలిగాడిదను దవడాస్పై యర్ధచంద్రప్రయోగములచే "గెటవుట్" చేయులేక, చచ్చిపెద్దమ్మయి, తండ్రిపనువ, తల్లిముసవని కొనవెత్తిపలుకులుపలికి దేశాలువిడిచి, పనుమపిల్లాముపడేపాట్లయినా చూడక అరణ్యాలపాలయి, "పిత్త

భక్తి—పితృభక్తి" అని పేర్లు వాడాకదు.

మాటపట్టింపులకేమి లేవోయి తాతాయనీ, యేదో యొక విధముగా జేరము సాగించలేక రాగాలు భోగాలన మాటకట్టె పెట్టి కూటిబాధ, కుమ్మ్మ బాధ, కొంపబాధ ఒంటబాధ, లేక కచ్చుగింగించి ముక్కుమిగిపట్టి చెట్టుకిందపైతాయించు "ఒడేదాడీ వాలాను" నీకెందకొం, రాజ్యకాంక్షయను మీదపడి జమాయించలేక మసిమసినగవులతో, వద్దముచ్చటలతో, వాలుచూపులతో, వంకనడకలతో, చిరునవ్వుబిగింపులతో కోకిలగానముతో కమ్మనిలుంచేతి బొమ్మల వయసుకలుకులు చెలరేగలచి చెంపలు కొట్టితే, మనసుగులో గుద్దులాట నయేమిటో చూతామనైనా బుద్ధిలేక, ఒక్కమైలు పొడుగుమద్దుమజారుచి చూతామని కోరికైనా లేక, బెదరుచూపులు జూచుచు పెదవులుదడుపుకొనుచు, మోచేతిమలుపుమాటలైనా చేతగాక పండువంటి రాజ్యాన్ని, బంగారు

వంశీసంగ్రాన్ని, మాణిక్యము లాంటిమంచిని మంటగలి
పి కన్నసంతానమును కానపాలుచేసి, ఉన్నభార్యను
ఊరుపాలు జేసి కాష్టాలడబ్బరు కాపుగాయుచు "సత్య
వాక్పరిపాలన — సత్యవాక్పరిపాలన" అని టంఢోరా
వేయువాడొకడు. 'పూర్ బ్లైండ్ క్రీచర్ (గుడ్డివాడు)
కదా యని దూరమాలోచించి ప్రేమతో సహాయ్య
పడినదానికి ప్రతిఫలమాయని "జబర్దస్తీపై బందో
బస్తుచేయక" న్యాయము — ధర్మమని — నీతియని —
బాలయనక, శ్రీరంగనీతులు, వంకాయికోతలు, డాబు
సరికోతలు, డబ్బాకేపాలువేసి, సప్తసముద్రములిం
కించేయు, కులపర్వతములు గూలించజేయు, అష్ట
దిగ్గజముల నడలించసేయు, మహాధీరులను, శూరు
లను, చేతలో బెట్టుకొని, గుండెలుకూలు శత్రుస్థాన
ముగ — దండలుదరిగిన మగవారికనులముదుట —
కొమ్ములువచ్చినకోడెగాండ్రి కొంటెచూపులకొనల
ముందు — నూనూగుమీసాలవారి నూత్నయౌవనము

కడ—ధర్మమూర్తులగు తాతలబిక్క మొగములదగ్గర కో అభిమానపుకొంటివాడా కడు కొప్పుబట్టి యీడ్చు కొనివచ్చిన కోమలాంగిని, కోకకొంగుకొన ద్రవేల బట్టు కొని కంయ్యో మొఱ్ఱోయని, కూకలుబెట్టు ఆమ కూతురిని—మానభంగము, మానభంగమని యేడ్చు మానవతిని, పోతవిగ్రహంలాగు—బతికట్టెలాగు—బుట్టబొమ్మలాగు ఊడగొట్టినమంచంకోడులాగు చూచుచునదరుబెదరు లేక, కన్నుగొలకుల నగ్నిమంటలు లేక, మోమునముడుతలు లేక, కనుబొమల చిట్లింపులు లేక, కోరమీసపు మెలిమడతలు లేక, పెదవినొక్కులు లేక, పాముబుసలు లేక శ్రీరామచంద్రా, శుద్ధసత్వ మూర్తివలె, జూచుచు "శాంతంభూషణమ్, శాంతం భూషణమ్" అని బోధించువాడాకడు.

పాపబుద్ధికో—పక్షపాతమునకో—పరమార్థమునకో—పాడుసేయుటకో—పాలించుటకో, పాదములుబట్టినవానిని, ప్రతిమాలినవానిని, ప్రణమిల్లిన

రంగా, అగ్గిబరాటావలె భగ్గునవెలిగిపోక, సిరులనక మరులనక—కరులనక—హరులనక—అర్ధరాత్రమున హాయిగా హంసతూలికాతల్పము పైన, పరుండి దబ్బపండు వంటి— దానిమ్మగింజలవంటి— తామరాకులవంటి—తాబేళ్ల వంటి—పంచదారచిలక వంటి—పాలమీగడవంటి, యౌవనయువాలుగల చక్కని చుక్కను, గజ్జెగోడిగను, విద్యామూర్తిని, వరాలకుప్పను, మాణిక్యాలమూటను, అబ్బా! రతీగాసిచేతి జంత్రపుబొమ్మను, నారామణిలకను, మహారాజుబిడ్డను విడిచిపెట్టి, చెట్లూ, పుట్టలూ, కొండలూ, బండలూ, నూతులూ, గోతులూ, దిమ్మరిగోట్టు తిరిగి తిరిగి, తిండిలేక, తిప్పలులేక, నిద్రలేక, నీరులేక, చిక్కిశల్యమై, మాలకాకిలాగు, కాలుకాలినపిల్లిలాగు, ఆసులోనికండెలాగు మసమసి, గతమని, మాయయని, మంచియని, మతులువిరచి "అహింసా పరమోధర్మ—అహింసాపరమోధర్మః" అని తెగనీలు

గునాడొకడు. ధర్మమని యొకడు — దానమని యొకడు. పరోపకారమని యొకడు — పారమార్థమని యొకడు — త్యాగమని యొకడు — భోగమని యొకడు — మతమని యొకడు — మహానీతియని యొకడు — భగవంతుడని యొకడు — బ్రహ్మాండమని యొకడు — వీరి జాతి బంగారుగాను, ఒకటే బాధలు — ఒకటే రాగములు — ఒకటే దరువులు — ఒకటే చూపులు — ఒకటే కోపులు ఏమి చూచినా, ఎక్కడ జూచినా, ఎవని చూచినా గుండె దడదడలుగద రాత్ర్యడీ! రాగాలు తీసి భగవంతుని జూచు నాడొకడు — భోగాలు మాని భగవంతుని జూచినవాడొకడు — భక్తి మాని చూచు నాడొకడు — కొండెక్కి చూచు వాడొకడు — కోతిపగోరి గాంచువాడొకడు — బెదరించి చూచువాడొకడు — బెల్లించి చూచువాడొకడు — అబ్బబ్బా! కాంతల కౌగిళ్లలో, పసికూనల ముంగిళ్లలో, వేశ్యల అంగళ్లలో, కవుల కారుకూతలలో, మునుల ముక్కుకొనలలో, అమ్మ

లక్క లహాస్యములలో, దాడినమ్మదాటులలో, తందా
నతానగాడి దరువులలో, పుష్టివాసమూలుగులలో,
కోశిప్రేగులవాడి కూతలలో, మొదలుకత్తిరింపువాని
మోటుపాటలలో, కోనశెట్టివానికోలాటములలో,
నిదపునామములవారి మెడలలో, కష్టగలవారిదృష్టు
లలో, తెగనీలుగుగాడి తైతక్కలలో, నూటపదకొం
డ్ల సెప్టలలో, "మైనస్" వాడిమతములలో, గొల్లసు
ద్దులలో, గోవిందనామములలో, కొండవాగు గుట్టపై,
దొమ్మరిసాని దొంతరపై, దూదేకులమియాదుక్క
పై, బడేసాహెబు బండపై, బోడిదాని గుండపై
మొండిదేవుడేగదా తాండవమాడుచుండును. అద్దుగ
డుగు దండాలు-ఏకాసిమరణాలు-రాకాసిజాతరలు-అ
మాసతానాలు-పున్నాలపూజలు- గుడిమీదబొమ్మ
మెడలోనితాడు, ఒడిలోనిపసుపు, అంతావింతయేగ
దా. గండందాటి పిండంభూమిపడితేకర్మ కాలంతీరి
కైలాసమునకు కాళ్లుచాపితే కర్మకుఱ్ఱవాని బుఱ్ఱకు

మంగలివాని కత్తికి జుత్తు లిపితే కర్మ, కర్మము చాలక గంగలో దిగితే కర్మ, కోడెగాని మెడలో తాడువేసిన కర్మ. వయసువచ్చిన మిఠారి, నుదనుని కాసింతసేపు గడిలో కతారి 'గప్ చిప్' నకు కావలసినంతకర్మ. ఇంటిలో నిదుంటే ముండజారిపోతే తలపు బిగింపులు-తల్లి ముందడుగా వేసి దాటిపోతే మీసమెగింపులు-తండ్రికి తలతగ్గులు ఇంటిలోని యిల్లాలి గొంటుతనపు తంటాలకు గడ్డము పెరుగులు-చీకటి తప్పునకు తప్పెట చప్పుడులు—విందు పిలుపులకు పనాదుమేళములు—బిడ్డకు జాచుట కడ్డుతెరలు-గడపదాటుటకు కానిశకునములు--మహా దొడ్డజాతిరా, మహాదొడ్డజాతి. దేశదేశాలచరిత్రలలో దివ్యమైన, దీప్తమైన, దిక్కైన తీరైన, తిన్ననైన దేశ చరిత్రయిదియే గదా!

జాతులలో కమ్మని కస్తూరివంటి జాతి, నీతులకు నిధి, భావములకు బంగారుకొండ, మాటలకు మాణిక్యము, కవులకు కన్నతల్లి, భావకుభాగ్యవల్లి, దేశ

సికొని, దానబ్బ సొమ్ముదాచిపెట్టినట్టు, తాతగారిము
ల్లె తగులబడిపోయినట్టు, వారమనక, వర్జ్యమనక, వేళ
యనక, పాళయనక తెగసాగుడు బేరమెందులకో! ముం
తకొప్పులకు గంటి కాడలు, ముక్కెరలకు, ముక్కుద్ద
ములు, చేతిగాజులకు జాతి గడియారములు బనా
యించి మొగమునకు కొట్టుకొన్న కొత్తసున్నపు జా
డుపూతలతో, షికారెందులకో! చంకబిడ్డకు చంద
మామను చూపి, చద్దిగుడిపి, జోలపాడి, జోకొట్టి, ని
దరపుచ్చుదానికి, జోలి చంకను తగిలించి బజారు
షాపింగులు, మార్కెట్టు రేటులు—మార్నింగు
వాకులు—మ్యారేజిబాంకులు—ఎందులకు? వహ్వా!
వహ్వా! తొంబదియేండ్ల తొక్కునకు తొలిసమర్త
ముచ్చటలు—మూడేండ్ల ముద్దుకూనకు మూలము
సుగులు. అరువదియేండ్ల యత్తగారి యడ్డాలలో పురి
టికంపులు, ముప్పదేండ్ల ముద్దుకోడలి ముంజేతులకు
ఎరుకులసాని పేరుముక్కలు, తాతగారి మీసాలకు

తళతళలాడు జీడిపూతలు— పోరగానికోలబుఱ్ఱకు బా
లామురుపులు, తండ్రిది పూర్వాచారపు పెఱ్ఱి తంతు, త
ల్లిది నాజూకు నాగరీకపు ధోరణి, తనది విడోమ్యా
రేజి గడబిడలు. కొడుకు ఇంగ్లండులో బడబడలు—
కోడలి 'ఎగ్మైండ్'లో గుడగుడలు—తన 'ఫూర్
మైండ్'లో దడదడలు. అత్తగారిది అద్దాలరవిక—
కూతురుది గుండీలపట్టు కోడలిది కుంఫినీ 'ఫేషన్'
జాలీ జాకెట్టు. సెహబాస్! సెహబాస్! ఏమినాగ
రీకము! ఏమి నాగరీకము! ఏమినాజూకు కుసుమః! ఏ
మి 'సివిలైజేషన్' చాలు చాలురా బాబూ! క్రొత్త
బులపాటము చాలును. అప్పుడేమైనదా, యింకా
ముందున్నది మునళ్ళపండుగ. సరేకాని యీమూల
చాలా గందరగోళముగానున్నది. చూపులాధిక్య
ము దృష్టి 'ఫోకస్' చేయాలి. ఆహా! 'నైట్‌వెరీబ్యా
టీ' 'సింప్లీగ్రాండ్' 'అన్నేచురల్' మ్యాచిలెస్, షోరా
మింగా! శక్తియుంటె నీదేశ క్తిరా! కత్తిలేదు—కఱ్ఱ

లేదు—మందు లేదు—గుండు లేదు, కత్తుక ఉక్కిరి బిక్కిరైపో, డెక్కపెట్టి ఫట్లిలు కొట్టుచున్నదిరా దేశ్యము. కుడుములు తిన్నా గుజ్జువేల్పు బొజ్జవలె రాజ్యరమకు కడుపుబ్బి భేరీమోత మ్రోగుచున్నది. రెగిన శాస్త్రియైనది. నూరుకాకులను తిన్నా, రాబందువకు ఒక్కగాలిపెట్టు. కపివంశ గుమ్మడి కత్తికిలా కువ. అబద్ధపు పెండ్లికి మద్దివాయింపున్నాడు, మాటలాడలేని మందభాగ్యుడు మహావక్రయై నడవనేవడ డబ్బమోత మ్రోగుచున్నాడు. నరసాపురము దగ్గర వక్క డ్డగిస్తే తిరుపతికొండెక్కి తిరిగిచూచె తాత తిరంగి గుండుకు, పిరంపు సరంజాంసిద్ధము జేయుచున్నారు. అగ్గిపుల్లనుజూచి యడలె తియ్యామనలు దప్పు డాయించు, అడవి సన్నాసి అయ్యగారి యద్ధకారానికి ఎదురుకోలు సన్నాహమంటూయున్నాడు ఓరి బాబోయి! గుమ్మము దాటి రానిక్కుడీసనుకు; కుర్చీలకెక్కి కూర్చునివాడి దుంప తెంపుతామని తోడా కా

ట్టుచున్నది. బావురుగాని కూతకు భర్తను కౌగిలించు కొను, అబల, భీరువ, అనద, ముగుద, ముట్టిరా డు వదలించుకొని, మోరవంచి, మోకాలు నేల దువ్వుచు, సవాళాయని పెద్దవీధియాబోతువలె రంకె లు వేయుచున్నది. పిల్లవాడు తల్లిమాట వినడు. తల్లి తండ్రికి లొంగడు. తండ్రిమనసు తామరాకులో నీటి వలె తల్లడిల్లుచున్నది. మ సుకుదురుపాటునకై మం చి పాత్రమేదైన వినవలెను. ఆదయోయిన తీర్థ మెమ రైనదే. అదిగో యావ్రక్కను కాలపురుషుడు కమ్మ ని కావ్యమును గంటమోతలతో ప్రారంభించినా డు. కావ్యమనగానే కంగారుపుట్టి దేహము గజ్జకాకె రకాయలాగు కంపమెత్తుచున్నదేమి చెపుమా. మన సు మంచిగంధపు పూతలకు, పుష్పాది పానుపులకు చిగురు విసనక్రాలకు, అగరువాసనలకు అరటిపట్ట లకు—తామరతూండ్లకు—కప్పూరపు కళికలకు, ఐ రువులెత్తుచున్నదేమి? వేటయాటములు, కోటగడచి

ముళ్లకంపలవలేదు. అర్ధరాత్రివాన శివమెత్తినట్లు దూలగొండ పసరు పూసుకొన్నట్లు తలకిరియబోయించి, అల్లల్లా అశ్వరభా' యని తందనాలాడించరేదు. శృంగారమును సంహారపటుముగ జేసి, దానికి శాంతరసముపూత మెరుగుపెట్టి, భవపరాజ్యముఖులకు, పధ్యము బెట్టి తలమును కలుచేసినాడు కప్పగట్టి ముకుట్టబెట్టి గంగమానుగు తలబోసులకు తప్పనన్నాడు. ఇక నునాయకుని మీద కన్ను వేదాము ఆవడు, అసాధారణమేధాసంపన్నుడు—సుగుణ గణవిరాజితుడు బహుసుందరమూర్తి— సంపూర్ణత్యాగి—లోపలా వెలుపలా ఒక్కటే పరబ్రహ్మస్వరూపము లౌకిక క్రియాధురంధరుడు—అడుగున కిడుగు—ఎత్తుకెత్తు పేచీకి పేచీ—నుడతకు నుడత—తోడికి తోడి. చేయికి చేయి కలుపుబడేవస్తాడు. నాయకరాలో, సస్యసంభరితమై, ఉదారచిత్తమై, ముప్పదిమూడుకోట్ల ముద్దుసూనులకు వీరమాతయై, రత్నగర్భమై, రామణీ

యొక్క సుందరవస్తుప్రదర్శినియై, మనోహరమగు స్వ
రాజ్యలక్ష్మి—సుగంధి—స్వరాజ్య సంపాదనా
మృతపానీయము సరిపడి—ఆశ్చర్యమా! దాస్యశృం
ఖలాభిభక్తి—బలే, పాత్రిగో—స్వభావసిద్ధమై మ
నోహరకల్పితములగు పాత్రికస్వభావములు... నాటకద
ర్శకుడో—జగన్నాటకసూత్రధారి—చెప్పుటకేము
న్నది? ఏ ప్రకరణమున కాప్రకరణమే, ఏ యం
కమున కాయంకమే, ఏ యుపాఖ్యానమున కా
యుపాఖ్యానమే, ఆటపై పాటలు—అష్టులు అష్ట
లు...ఏరతులు వలె యున్నవి. వేషధారులు, కు
చేళ్ళు, బేస్తులు, పైబేస్తులు, మీదపావుళ్ళు బెట్టి
కొంపలన్నియుగాని మరి యుడాయించుచున్నారు. ఎక్క
డకక్కడే శక్తి—ఎక్కడకక్కడే భక్తి—ఎక్కడకక్క
డే ముక్తి—ఏమికథాకల్పన—ఏమి పాత్రపోషణ, ఎట్టి
పాత్రౌచిత్యము—ఎంతటిరసపుష్టి—ఎంతహంగామా
మై నాయున్నది. ముద్దుగుముచ్చటలున్నవి. ముసుగు

లో గుద్దులాటున్నది. నాకే కథపట్టులో దూకెదము. అమ్మయ్యో! పాంచాలీపరాభవఘట్టమే. కన్నులు చెదరి నిద్రగమ్ముచున్నవే! దేహము వడకుచున్నది. మాటలు స్వాధీనములుకావు. "మైండ్ సెన్సెస్" ఆ యుక్కిరిబిక్కిరులేమి?—ఆ తెగమూలుగులేమి?—ఆ యార్తనాదములేమి?— ఆ రక్తస్రావములేమి?— ఆ హాడావడులేమి?—ఆ రవికసడలింపులేమి? ఆ మేకుబిగిం లేమి?—ఆ గుండదట్టింపులేమి?—ఆ ముక్కోపుముచ్చటలేమి?—ఆ పొట్టప్రాకులేమి?—ఆ ముక్కరాపులేమి?—ఛీ—ఛీ—ఛీ—రావణుడు సీతను కరాభవింపలేదా?—కిరాతుడు దమయంతిని మోహింపలేదా?—కోడికేవమున 'ఊయింగ్' చేసిన కొంటిదేవేంద్రుడు లేడా! రక్కసిచేతలకైన తక్కువదే పాంచాలీపరాభవము. రసము నీరసముగదా. పట్టిగాడిద గత్తర ఆడపిదున్నలపోరలాట—ఎలుగుగొడ్లుకుమ్ములాట. ఇక లేదు—ఇక లేదు—బాధలిడేశవరాత్రిమా

లు పట్టశక్యముకావు. ఆడబ్బసిగతరగ, ఆడువారిమీ
'ద హడావడిచేసి, కొమ్ములు తిరిగిన ఉమ్మ్రారావులుగొం
డలతో కూలి నేలపట్టమైనారు. పూర్వము. చేపమై,
తాబేలై, పందమై, సందియైన పరమాత్మ 'ట్రావి
లింగ్ బేగు' తో బయలుదేరి తిరుపతిక్షేత్రమునకు ము
హూర్తము పెట్టకమానదు. 'ఆపరేషన్ కు ప్రారంభి
స్తాడు. ఇక్కడ నిలువగూడదు. పేరొక భాగమునకు
పోదాము. అబ్బోసి—అబ్బోసి—ఇది మంచు దాని
వ తాపం. ఏలినాటిశని—ఎండలో వేసినమంచం నల్లు
లకంటె, పెనముమీద వేసిన రొట్టెముక్క కంటె—కుం
డలో నుడుకు కూర కంటె—కుంపటికుదురులో కుత
కుతలాడు ద్రావకము కంటె కష్టముగానున్నది.
బుట్టలోకెక్కిన చితకందువలె నట్టలు ట్టుకొని యూ
డిపడకున్నారేమి? క్రిందపెట్టిబోర్లించి పైన దుడ్డుకఱ్ఱ
తో బజాయింపగా నెండిపోయిన వంగవెరుగుబద్దల
లాగు రాలుచున్నారు. ఇది యమానుషకృత్యము.

కవిగాడిపై శ్వేతచ్ఛత్రపూర్వకంగా గని బలుజామాయింపు తల
తిరుగుడుగోము. యనుకున్నాను. కాని, యనుభవ
ముమీద తెలిసినప్పి అది కేవలము నా తెగింపు త్సవ
దబాయింపు నా కేసిగ్గువేయుచున్నది. అదిగో మామం.
ఆజోసినోటి ముచ్చటకు — ఆ సుద్దగా మెతుకలముక్తా
ఋపులకు — ఆ ముద్దుబెట్టుల మోటుపరుపులకు
మోహపడి, క్రొంపనక, గోడియనక, పిల్లనక, పెద్ద
వక, నగలనక, నాణెములనక, బ్రతుకనక, భాగ్య
మనక, బాధనక, బ్రాధన, కులమువిడిచి — బలము
విడిచి — చేలము విడిచి — సిరిసంపదలు విడిచి — సింగా
రములు విడిచి — మహారాజసౌఖ్యములు విడిచి — మ
హాసౌధములు విడిచి — నడిబట్టలు కట్టి — మాహారణ
రంగమనక — నుంటు ప్రోవనక — నూంగను సిగుం
డమనక — అదరు బెదరు మాని — తొట్రుపాటు బెఱుకుమా
ని — నిశ్చలముగా — నిర్మలముగా — నిమ్మకు నీరెత్తిన
ట్లు గుమ్ముగా కిల్లుగా పడచివచ్చి మేము మీ మని

కుమ్మలాడి యెటుకూలిపోవుచున్నారో చూడు. అదీ గోరోయ్, మనవ ఝంపోగుపతాలము సిద్ధ. సుమతీ యని సిద్ధమయినది బట్టపిండినట్లు పేగులు పిసికేసి వేదాలు, శాస్త్రాలు—వల్లించి చలాయించుటకు ఫస్టు మాటపట్టింపు వచ్చినదంటే నాసామిరంగా, రాజ్యాలు రాజ్యాలు తలక్రిందుచేసి— తారుమారు చేసి— తబ్బిబ్బు చేసి—దశాయించి 'హింగన్న' కొట్టించుటకు 'బెస్టు' మతం చెడి మాదిగవానికి మంగళహారతి పట్టినాడంటే మాలవానికన్న కనాకష్టముగా పీపాలు, పీపాలు టోకున అన్నులవారి యూపోసనపట్టుటకు తయార్యారు—అంతని లేనినాడు మ ప్లీమంగాకు ముందయి ఉపనయనమున టిమాట యున్నదనుమతీ యని నుతిచేయుటకు హాజరు—

లోకాలు లోకాలు దల్లడిల్ల జేసిన నల్లని సామి 'బాపనయ్య నాదేనరయని' బాకాఊదినాడంటే బాధెందుకు. తెలివితేటలకు డివిటీయంటె ధుమధుమ

లెందుకు. బ్రహ్మముఖాన్ని పుట్టినాడంటె భగభగలు భుగభుగలు — రుసరుసలు — రుంయి రుంయిలు — ఎందుకు? తాతముఖాన్నే కాదు దానిసిందరగ ప్రతి దానిముఖాన్నా తన్ని పుట్టానని ఢంకాకొట్టి — నగారావేసి — రండోలువాయించాలి — ఏదిపట్టినా పై స్థాయేగదా! సంఘశ్రేయమునకై, ముట్టరావని, చూడరాదని మూలబెట్టినమాలవానిని దేశభాగ్యమునకై చేరదీయుటకో చేతులుగట్టుకొని సిద్ధమైనాడు. నీటి కాసులుగట్టి జగజెట్టియై పట్టుపుట్టములు కట్టినవాడు ముందుగానే 'రిజర్వ్డ్' చేసికొనుటకు వర్ణసన్యాసియగుటకు సందేహింపడు. కాలముతప్పినప్పుడు గడ్డంపట్టుకొని కాదనిపించగలడు. కర్మాకే కన్నెర్ర చేసి కాళ్ళు కడిగించుకొనగలడు. కాదని కలహామునకు కాలుదువ్వితే అంగవస్త్రాన్ని సకు ఝాంకీ చెంబు అంటగట్టి — గిరగిరలు. తాటియాకునకు ఘంటాలగిలించినాడంటె గుఱ్ఱుకాడు — లేడిపరుగు. పట్టుపట్టి

తే మూడు శేర్లమూర్ధ మూడుచిటికలలో 'మెస్మరిజమ్'
జాతికి "స్టోరురూమ్" వంటివాడు. దేశానికి "రిజ
ర్వ్ డ్ బ్యాంకు" జ్ఞానదీపకళిక. నాబంగారు బాపన
య్యని బ్రతికిబట్టకట్టనివ్వండి. ఈవడిదుడుకులు తగ్గి
కొంచెం స్థాయిపడితే అగ్రతాంబూలమునకు — సభా
కట్నమునకు హాజరై, "ప్రజా టుసార్" అనికలుకు
తాడు మూడండి. తక్కినజాతులు తొక్కులాడుతూ,
గుడ్డమిటకరిస్తూ దవడలుతాటిస్తూ, చేతులు కాలిన
వెనక ఆకులకు దేవులాడుతూ, వారివారి" "రేంకు"
ల్లోతిరుగా "స్టేడ్, కాకపోతే చెవికదపాయించుకొని
పోతాను. ఇది సిద్ధాంతము — "గోల్డెన్ రూల్" తప్ప
దు. తాతాచారిగారిముద్ర. సరే పైపెట్టుకుపోదాము
ఇది లక్ష్మీకటాక్షము. కథానాయకుని పుట్టినిల్లు.
కలియుగధర్మప్రమాణమునకు "కీ" మానవజీవితము.
నకు 'శిఖామొహర్' సంసారపాకపునకు సాపవట్టిన
రత్నం — అవతారపుట్టం. బలేబాగున్నది. పౌరుషమే

ప్రధానమైననాడు క్షత్రియుడై, భావము ప్రధానమైన నాడు బ్రాహ్మణుడై, మాయ ప్రధానమైననాడు మాయామోహిమగువడై, సేవప్రధానమైననాడు శూద్రుడై, పశుప్రధానమైననాడు నందియై, పాలించిన పరమేశ్వరుడు నేడు, కాలము చూచి కరుపు చూచి శక్తి చూచి—యుక్తి చూచి, సమయము చూచి, సాధనము చూచి, పోటుచూచి పొగరుచూచి మంది చూచి చెడ్డచూచి, సరుకు చలామణీ చేయుటకై పుట్టి నాడురా, 'కోమటిపిరికి నూతులో ఉరికి' అను సామెతలో అందుకే, ముందుకు నడవమని కొంతసేపు, కాదు కాదు ఆగుమని కొంతసేపు, సరుకు నాణెము కొంత సేపు, చాలదని కొంతసేపు చూసే లేదని కొంతసేపు ముందు కాలు మోపి వెనుక కాలు తీయమని కొంతసేపు, ముస్సొరమయ్యాటకి కొంతసేపు, లాభసాటి కాదని కొంతసేపు, పాడిపదిపాడక, వేసినదిచేయక, దమ్ములు మార్గ్గిలో పలిపరీక్షయని—పైపరీక్షయని-

అగ్నిపరీక్షయని—ఆఖరుపరీక్ష యని, గడువులుపెట్టి, బెదరించి, బెల్లించి, పీడించి, నానవేసుకొని కూర్చున్నాడు. వాయిదాలువేసి యెగగుంజి—దిగగుంజి, మెకుతాపడంచేసి, ముగ్గులో కిదిపి, జడ వేసి, కత్తిరించి, మార్కెట్టు రేటుపై పాటకొటి వేయుటకు సిద్ధముగానున్నాడు. పట్టుధగధగలతో బంగారునిగనిగలతో, నబ్బుతళతళలతో, ఇస్త్రీకి పెళపెళలతో అత్తరుఘుమఘుమలతో, సొకుబసాయించుజాతి "ఫ్రీడమ్" బిడాయించి అసలువరకు, సికార్సుయినది కలిపి దేశమును రక్షించినాము.

లోవలిగుట్టు పెరుమాళ్ళకెరుకగాని, దీనిభావమే మొత్తిరుమలేశాయని, పైకిపోవాము. ఆహాహా! ఆన్యాయము—"అయిన్ డేజిటై, హెడ్ గిడ్డితె, బైన వర్క్ స్టాప్,, ఆద్యోసిక్యేషన్,, లోకడ్డాము. పోనిగానీ, లాంకోటు నాసాపులు, లాభసాటిలోపడి, లోభానముందులాభము చూడకపోయినా, చంక

పుస్తకాల వెంకయ్యలకైనా, శంకరదోంబి పాత్రపోష ణకు పాటుపడవద్దూ. కావ్యములో—కథాభాగము లో—ముఖ్యమైన పాత్రేమి రసాభాసమైనదేమి ? ఈయపకీర్తి—కళంకము, కాటుకమచ్చ—గ్రహణాం మొత్తి, త్వరగా "రికవర్" చేసికొని, తరతరముల వారు వీరిపైనుమ్మెత్తిపోయకుండా, "క్రిటిసిజమ్" చేసి. దుంపతెంపకుండా, యికనైనా వైస్‌స్టెప్'తీసికోకపోతే, మహాపుణ్యకాలములో, కుక్కనాట్టినకుండైపోతారు కక్కినకూడై పోతారు. "వేస్టులేండు" క్రిందజమో జయిపోతారు. "స్కార్ కోర్" క్రిందపాతుకుపోతారు. వారిమీదనేయాధారపడి "మీన్సు" కై 'నాన్సెన్సు' పాఠాలుచెప్పే, పంతులయ్యలుకూడా "వైల్డుబ్రూట్సు" క్రిందనేజమ. పంతులమ్మలో మనంచెప్పలేము.

సరేకానీ మరొక్క "స్టెప్పు" "పూర్ నేషను" దీని హృదయము, గోధుమపిండివంటిది. లక్కవంటిది మైనంవంటిది. మైదాపిండివంటిది. ఈపట్టుతప్పినా,

భద్రము. నేనుపోతాను. మరియొకసారికలిసికొందాము. సెలవు.—సలాము—నమస్కారము—రాంరాం- అంతాహుళక్కే, కథకంచికివెళ్లింది—మనంయింటికి వచ్చాము.



శ్రీవిద్యావిలాస ముద్రాక్షరశాల:—రాజమండ్రి, 1922

